# గీతావాణి

[illegible] సంవత్సరము  [illegible]

[illegible]

శ్రీగీతాసాహిత్యసేవాసమితి,
ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 మే 1955.

# విషయసూచిక.



## భాకాంక్ష

ఆర్యా!

పూజ్యపాదులు ఆదిశంకరుల జయంతి జయప్రదముగా జరుగుగాత! అద్వైత మతమును స్థాపించిన శంకరులు అఖిల ప్రపంచారాధకులు. వారి కవిత అజరామరమైన ఆనందమును డెందంబులకు అందించుచున్నది. వారి ప్రస్థానత్రయము మోక్ష సౌధారోహకులకు ప్రధానాధారము సత్యశివసుందరమైన మార్గమును వారు మనకు చూపించిరి. శాంతి శివాద్వైతమైన వారిభావము గీతావాణియందు ప్రతిధ్వనించుచున్నది. గ్రహించిన ప్రజలు కల్యాణములను గీతాకర్తచే పొందుదురుగాత. "గీతా సుగీతా కర్తవ్యా — కిమన్యైః శాస్త్రవిస్తరైః".

భక్తులకు నా నమస్కారాలు.

చిలకలూరిపేట.
(గుంటూరు.)

శాస్త్రి వెంకటనరసయ్య,
అధ్యక్షుడు: శ్రీ భారతీ సన్మానసంఘము.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:

[illegible]

మేనేజరు:

[illegible]

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

సంవత్సరచందా 4—0—0 * విడిప్రతిక 0—6—0.

15th MAY 1955.

# గీతాగానము.

## కీ॥ శే॥ డాక్టర్ రంగా చిన్నచలమయ్యగారు, బాగలమ్రి.

[ 1955 మార్చి సంచిక 2వ పుట తరువాయి. ]



15. బయటిగాలిని లోపలికిపీల్చుట పూరకమనియెదరు, లోపలిగాలిని బయటికిపంపుట రేచకమనియెదరు, ప్రాణాపానములను లోపలనిలిపి బంధించుట కుంభకమనియెదరు, ఇదియే ప్రాణాయామ యజ్ఞము ఫల్గుణా......
వారివారిగతులచే – వాయుబంధనజేతురూ
ఇదియెనీవూ తెలిసికో – యోగాయజ్ఞమే పార్థివా ॥జ్ఞా॥ (శ్లో॥ 29)

16. కొందఱు నియతాహార యజ్ఞమునుజేయుదురు, ఎవరుచేయదగిన యజ్ఞములు వారు చేయుదురు, పాపములను పటాపంచలుగజేయుటకు, అట్టి యజ్ఞఫలముల దేవుని కర్పించి, మిగిలినదానినే స్వీకరింతురు ఫల్గుణా...
అట్టివారలే ధన్యులుగా – అట్టివారలే ముక్తులుగా ॥జ్ఞా॥ (శ్లో॥ 30, 31)

17. ఈ సాధనలన్నియు వేదమందున చెప్పబడినవి, మనుష్యకల్పితములుగావు, యీ యజ్ఞములన్ని కర్మవలనపుట్టినవి, శాశ్వతసుఖంబుల నియ్యజాలవు, అన్నియజ్ఞములకన్న జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠము ఫల్గుణా...
చిత్తశుద్ధికే సాధనమూ – యిదియెనీవు తెలిసికో
కర్మఫలితమూ లన్నియూ – జ్ఞానమునందే లయించునూ ॥జ్ఞా॥ ( „ 32, 33)

18. పెద్దలసేవజేయుచు, సందేహముదీర్చికొనుచు జ్ఞానమునుపొందుము, అనుభవజ్ఞానులకే అది తెలియును, సమస్తప్రాణులను నీయందు నాయందు, చూచినపుడె, నీవు మోహముజెందవు ఫల్గుణా...
అప్పుడెనీకూ జ్ఞానమూ – అబ్బినయట్లూ తెలిసికో
అనుభవమందినా వారలే – సందేహింపరూ దీనినీ ॥జ్ఞా॥ ( „ 34, 35)

19. పాపులలో పెద్దవాడైనను, జ్ఞానమును సంపాదించినపిమ్మట, జ్ఞానమను నావచే సంసారసముద్రము దాటగలడూ, ఎన్నికట్టెలనైనను అగ్గితోకాల్చినట్లు ఫల్గుణా...
జన్మజన్మలా పాపములు – పటాపంచలై పోవునుగా ॥జ్ఞా॥ ( „ 36, 37)

20. శుద్ధమైనది, పవిత్రమైనది, పేరుబొందినది జ్ఞానయోగమే, శ్రద్ధ, ఆసక్తి, సేవా, నమ్మిక, ఇంద్రియనిగ్రహము, గలిగినవెంటనే, జ్ఞానధనముచేకూరు ఫల్గుణా...
అనుభవమందినా జ్ఞానులూ – మోక్షమాబొందీ సుఖింతురూ ॥జ్ఞా॥ ( „ 38, 39)

21. శ్రద్ధయులేక సంశయమననుగలవానికే, యిహపరలోకములందు సుఖములేదు, అంతయు భగవన్మయ మనుమండువానికే, కర్మసంబంధములు లేవు ఫల్గుణా...
సంశయమనసును వీడుమా – చక్కగయుద్ధమూ చేయుమా
లెమ్ము లెమ్ము ఫల్గుణా – చేయుముచేయుమా యుద్ధమూ ॥జ్ఞా॥ ( „ 40, 41)



సంపుటి 4 ★ స్వస్తిశ్రీ మన్మథ – వైశాఖమ్ ★ సంచిక 11

# శ్రీ శంకరజయంతి మహోత్సవము.

వైశాఖ శుద్ధ పంచమి జగద్గురు శ్రీ శంకరాచార్యులవారి జన్మజయంతి. క్రీ॥ శ॥ 788 యందు వారు జన్మించిరనియు, క్రీ॥ శ॥ 820 లో గుహాప్రవేశ మొనర్చిరనియు చరిత్రకారులు చెప్పుదురు. కేవలము ముప్పదిరెండు ఏండ్ల జీవితములో వారు అపూర్వమైన కార్యసిద్ధిని పొందియున్నారు. ఎనిమిదేండ్ల యీడుననె గురుగోవింద పాదాచార్యులవారికడ సన్యాసదీక్షను గ్రహించి వైదికధర్మ సంస్కృతిని పెద్దయెత్తున ప్రచార మొనర్చిరి. భారతభూమినంతటిని పాదచారియై పర్యటించి కుమతములను ఖండించి లోకమున ప్రబలిన అపభ్రమ

లనునిరసించి యావద్భారతమున అఖండ ఏకతను స్థాపించిరి. అయి ననుఆశ్చర్యకరమగు విషయమేమనిన ఆతని సిద్ధాంతమునసుసరిం చెడి సాధుసన్యాసులు కేవలము నివృత్తిపరాయణులై లోకసేవ జేయుటసమాజసేవచేయుట తమకవమానకరమని తలంచుచున్నారు. కాని వారి ఆదిగురువగు శ్రీశంకరులవారు యావజ్జీవము అసాధారణ మగు కృషిసల్పి లోకమునకు అపారసేవను చేసియున్నారనుట మఱచిరి కాబోలు!

భారతప్రధాని, మనప్రియతమ నాయకుడు శ్రీ జవహర్ లాల్ నెహ్రూపండితుడు తానువ్రాసిన విశ్వచరిత్రయందు శ్రీ శంకర భగవత్పాదుని గురించి వ్రాసిన కొన్ని అంశములను క్రింద ఉద హరించుచున్నాము.

" ... ఇంతవఱకు కొందరు రాజులను గురించియు, రాజ వంశమునుగూర్చియు చెప్పితిని. వారందరును తమ తమ జీవితము లలో ప్రచండముగ ప్రకాశించి కాలప్రవాహమునబడి విస్మృతి గర్భము జేరుకొనిరి. కాని ఆరాజులకంటె — చక్రవర్తులకంటె అమిత యశస్సు నార్జించిన ప్రభావశాలియగు మహాత్ము డొకడు దక్షిణ హిందూదేశమున జన్మించెను. శ్రీ శంకరాచార్యుడను పేర వెలసిన ఆ మహాపురుషుడు క్రీ॥ శ॥ ఎనిమిదవ శతాబ్దము చివర అవత రించెను. ఆయన హిందూధర్మమును పునరుద్ధరించెడి మహోద్య మమునకు దొడగి, తన అప్రతిమాన ప్రజ్ఞావైభవముతో బౌద్ధమత మును పరాస్తమొనర్చి, వైదికమతమునకు విజయధ్వజములో యనునటుల భారతదేశమునకు నలుదిశలను అద్వైత సంప్రదాయ మఠముల నాల్గింటిని స్థాపించెను. హిమవంతములో కేదార

నాథమునందు వారు దేహత్యాగము చేయునప్పటికి వారి వయస్సు ముప్పదిరెండు మాత్రము.

శ్రీ శంకరులవారి కార్యసిద్ధి అపూర్వమైనది. సర్వోసర్వత్ర విచ్చలవిడి నిరంకుశ ప్రాబల్యమును సంపాదించిన బౌద్ధధర్మమును హిందూదేశమునుండి వెలుపలికి తరిమిన వారిప్రభావము అప్రతిమానమైనది. వారి అద్భుతకృషివలన వైదికధర్మమునకు యావద్భారతమునను అపారమగు పలుకుబడి యేర్పడెను. ఆయన బ్రాహ్మణవర్గమునకు అధినేతయై వెలసెను. వారి గ్రంథములును, భాష్యములును జనులకు బౌద్ధిక వికాసమును కల్గించినవి. కేవలము తన బుద్ధివైభవముతో కోట్లకొలది ప్రజలకు నాయకుడై చరిత్రలో శాశ్వతస్థానమును సంపాదించుట చిన్నవిషయము కాదు......"

శ్రీ శంకరాచార్యులవారినిగూర్చి శ్రీ కాకా కాలేల్కరుగారు తమ అభిప్రాయము నీవిధముగ వెల్లడించియున్నారు.

"శ్రీ శంకరాచార్యులవారు కలియుగమున యాజ్ఞవల్క్యునంతటివారు. వ్యాసునకు అపరావతారమని చెప్పదగినవారు. అల్పవయస్సున — అచిరకాలముననె వారార్జించినకీర్తి అనన్యసామాన్యమైనది. 'ముహూర్తం జ్వలితం శ్రేయః — న తు ధూమాయితం చిరం' అస్తమానము పొగరాజుటకంటె ఒక్కక్షణము గప్పున మండుటలెస్స; అని నీతిశాస్త్రవచనము. ఈ నీతి శ్రీ శంకరులవారికి జీవనమంత్రమై యొప్పినది. ముప్పదిరెండేండ్లు మాత్రము జీవించి హిమాలయమున దేహత్యాగము చేసిన ఆ మహాసన్యాసియొక్క ఘనత హిమాలయమునకంటె చిన్నదికాదు. నల్లరాయి తెల్లమంచు తప్ప మరేమియు దొరుకని హిమవత్పర్వతమునకు సాటియైనది

శ్రీ శంకరుని అద్వైత తత్త్వజ్ఞానము. చెట్లు చేమలు మొలవని హిమవంతమున సమస్త వనస్పతి సంతానమునకు తల్లులై గంగా, యమునా, బ్రహ్మపుత్రా, సరయూనదు లావిర్భవించి దేశమంతటిని సస్యశ్యామలము ఫలవృక్ష సంపన్న మొనర్చుచుండునట్లు శ్రీశంకర భగవత్పాదులవారి అద్వైత సిద్ధాంతమునుండి కర్మోపాసనాభక్తి జ్ఞానధ్యానములు ఉచితరీతి బయలుదేరి హిందూధర్మమును సర్వతోముఖ సమృద్ధముగ ఏకసంస్కృతి బద్ధముగ నొనర్చుచున్నవి."

జగద్గురు శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారి జయంతీ సప్తాహామహోత్సవమును మహద్వైభవముగ జరిపి మా గీతావాణి కార్యాలయము తన విధాయక ధర్మమును చెల్లించినది. ఈ మహాత్కార్యమున ధనధాన్య సహాయమొనర్చిన ఉదారులకును, తమ మహోపన్యాసములతో ఆధ్యాత్మిక జ్ఞానధారలను వర్షించి భక్తకోటి చిత్తములను రసప్లావిత మొనర్చిన పెద్దలకును గీతావాణి పక్షమున అనంతానంత ధన్యవాదములు. గీతాచార్యుడు శ్రీ కృష్ణభగవంతుడు వారికి నిరతిశయ నిత్యానంద సుఖశాంతులను ప్రసాదించుగాక!

జై శంకర భగవత్పాదులకు —

జై అద్వైత సిద్ధాంతమునకు —






(గతసంచిక 7-వ పుట తరువాయి.)



నాల్గవ అధ్యాయము ముప్పది రెండవ శ్లోకము. భగవంతుడు ప్రియభక్తుడైన అర్జునుని చూచి యిట్లనెను — "సవ్యసాచీ! అనేక ప్రకారములగు యజ్ఞము లీవిధమున వేదములందు విస్తారముగ ప్రతిపాదింపబడియున్నవి. వాటి నన్నింటిని కర్మజన్యములని గుర్తెరుగుము. అట్లెరిగి సంసారబంధమునుండి విముక్తుడవు కమ్ము".

"దైవమేవాపరేయజ్ఞం" అని ప్రారంభించి వివరించిన ద్వాదశ యజ్ఞములును సమస్త వైదిక శ్రేయస్సునకు సాధనభూతములైనవి. ఈ యజ్ఞములన్నియు ఋగాది వేదములందు అనేక ప్రకారముల వర్ణింపబడినవి. ఈ యజ్ఞముల స్వరూప ప్రకారములను తెలిసికొనుటకు వేదములే శరణ్యములు. కపోలకల్పనతో తెలిసికొనవలనుకాదు. ఆ యజ్ఞముల ననుష్ఠించువానికి కల్గు ఫలముకూడ చెప్పబడినది. ఆత్మ అకర్మ స్వరూపము; కావున ఆత్మయందెట్టి వ్యాపారమును సంభవింపదు. ఈ యజ్ఞక్రియలతో నైత మాత్మకు సంబంధము లేదు. నిష్క్రియాత్మ స్వరూపుడనగు నేను



అసంగుడను — ఉదాసీనుడ ననెడి జ్ఞానమును బొంది సర్వ సంసార బంధమునుండి విముక్తుడగుటయే యీ యజ్ఞ కర్మ రహస్యముల నెరుగుట

వలని ఫలము. ఇట్లు కర్మయందు అకర్మ దర్శన మొనర్ప గల్గునని భావము.

కర్మ యజ్ఞములకు ద్రవ్య యజ్ఞములని మరొక్క పేరు. వాటి కంటె జ్ఞాన యజ్ఞములు శ్రేష్ఠము లని భగవంతుడు ముందటిశ్లోకమున చెప్పుచున్నాడు.

"అర్జునా! ద్రవ్యమయ యజ్ఞ ములకంటె జ్ఞానయజ్ఞ మధిక శ్రేష్ఠ మైనది. కర్మము లన్నియు నిరవ శేషముగ జ్ఞానమునందు పర్యవసించ గలవు, కావున జ్ఞానము శ్రేష్ఠము."

ద్రవ్య యజ్ఞము మొదలుకొని జ్ఞాన శూన్యములగు యజ్ఞము లెన్నెన్నికలవో వానికంటె జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమని శ్రేయస్కర మని భగవంతుడునుడివియున్నాడు. ఎందుకనిన. జ్ఞానశూన్యములగు సమస్త యజ్ఞములును అశాశ్వత మగు సాంసారిక ఫలముల నివ్వగలిగి నవె. జ్ఞానము శాశ్వత ఫలమగు మోక్షము నివ్వగల్గుచున్నది. ఈ విషయమున శ్రుతిస్సైతము "జ్ఞానా దేవ తు కైవల్య" మని పలికినది. అధికారి యైనవానికి జ్ఞానముననే మోక్షము సిద్ధించునని దాని యర్థ ము. అగ్నిహోత్ర జ్యోతిష్టోమ సోమయజ్ఞ చయనయజ్ఞములని చెప్పబడు శ్రౌతకర్మములును, ఉపా సనలని చెప్పబడు స్మార్త కర్మము లును నిరవశేషముగ బ్రహ్మాత్మైక్య జ్ఞానమునందు పరిసమాప్తి చెందు చున్నవి. ఈ శ్రౌత స్మార్త కర్మము లన్నియు పాపరూప ప్రతిబంధమును నివృత్తిచేయుటద్వారా ఆత్మజ్ఞాన మునందె పర్యవసానము చెందు చున్నవి. ఈ విషయమున శ్రుతి వాక్యము సైతమొండు కలదు.

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" అనియు "ధర్మేణ పాపమపనుదతి" యని యు చెప్పబడినది. దాని అర్థ మేమ నిన — "అధికారియగు పురుషుడు వేదాధ్యయనము వలనను యజ్ఞము వలనను దానము వలనను తపస్సు వలనను ఆత్మజ్ఞానమును పడయు గోరుచున్నాడు ధర్మముచే పాప మును తొలగించుకొనుచున్నాడు"

ఆత్మజ్ఞానము కల్గుటకు పాప ములు ప్రతిబంధకములై యుండును. పాపములు ప్రక్షాళన మగువరకు జ్ఞానము కల్గదు. పాపములు తొలగ వలెనన్న శుభ కర్మము లొనర్ప వలెను. కావున ఆత్మజ్ఞాన ప్రాప్తికి శుభకర్మములతో పని యున్నది. ఈ

అర్థమును వ్యాసులవారు త మ సూత్రములందు "స ర్వా పే క్షా యజ్ఞాది శ్రుతే రశ్వవత్" అను స్థల మున ఉల్లేఖించినారు. ఈ చో ట భాష్యకారుని వివరణము చూడదగి నది. ఇంతకును అన్ని యజ్ఞముల కంటె జ్ఞానయజ్ఞ ము త్తమమని ఫలి తార్థము.

అట్టి ఆత్మ జ్ఞానమును పొందు టకు చక్కని ఉపాయ మెద్దియను శంకకు భగవంతుడు ముప్పది నాల్గవ శ్లోకమున జ్ఞానప్రాప్తి సాధనమును చెప్పుచున్నాడు.

"ఓ పార్థా! సమ స్త పు ణ్య కర్మములకును ఫలభూతమగు ఆత్మ జ్ఞానమును అవశ్యముగ నీవు పడయ వలెను. ఆత్మజ్ఞానప్రాప్తికి ఆచార్యో పాసనము అనివార్య క ర్తవ్యము. 'ఆచార్యవాన్ పురుషోవేద' – అని శ్రుతియు జెప్పినది. నరుడు గురు పుత్రుడు కావలెను. బ్రహ్మ వే త్తలగు ఆచార్య పురుషుల ఉప దేశ మూలముననె జ్ఞానప్రాప్తియని సర్వసమ్మతాభిప్రాయము. అర్జునా! నీవుకూడ ఆచార్య సన్నిధానము నాశ్రయించి దండవత్ ప్రణామము లొనర్చుము. వారి చి త్తములు ప్రస న్నము లగునట్లు సేవలు చేయుము. సమయ మెఱిగి కావలసిన ప్రశ్నల నడుగుము. నేనెవరు? సంసార బం ధము నా కెట్లు సంప్రాప్తించినది? దీనినుండి కడతేఱు మా ర్గ మే ది? యని సవినయముగ ప్రశ్నింపుము. నీ శ్రద్ధాభ క్తులకు – ప్రణిహిత సేవ లకు మెచ్చి ఆ మహనీయులు నీకు మోక్ష కారణమగు ఆత్మ జ్ఞానము నుపదేశింపగలరు."

భగవంతు డీశ్లోకమున జ్ఞానియని త త్త్వదర్శియని ఆచార్యున కుండ వలసిన రెండు లక్షణములను చెప్పి యున్నాడు. జ్ఞానియనిన పదజ్ఞాన మును వాక్య జ్ఞానమును యు క్తిజ్ఞాన ము ను విస్తారముగ కల్గినవాడని యర్థము. త త్త్వదర్శియనిన సంశయ విపర్యయములు లేక ఆత్మ సాక్షా త్కారమును బొందినవాడని యర్థ ము. అనగా శాస్త్రజ్ఞానమును అను భవజ్ఞానమును కల్గినవాడె గు రు పీఠమునకు అర్హుడని తాత్పర్యము. ఈ విషయమునందు ముండకోప నిషత్తు చెప్పిన వాక్యమొకటిగలదు.

"తద్విజ్ఞానార్థం స గురు మేవాభి
గచ్ఛేత్ సమిత్పాణిః శ్రో
త్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥"

ఆ పరమాత్మ సాక్షాత్కారము నకు అధికారి యగువాడు యథా శ క్తి హ స్తమున అనుకూల వస్తువు లను గై కొ ని శ్రోత్రియుడును

బ్రహ్మనిష్ఠుడును నగు గురువు సన్నిధికి వెళ్లవలెను.

'శ్రోత్రియం—బ్రహ్మనిష్ఠం' అని ఉపనిషత్తు చెప్పిన మాటలనె, అదే అర్థమునకు తగినట్లు భగవంతుడు జ్ఞాని - తత్త్వదర్శియని పేర్లు మార్చి నుడివినాడు. ఆ ఉభయ లక్షణాన్వితుడగు గురు డుపదేశించిన ఆత్మజ్ఞానమె మోక్షమును కల్గింపజేయునదై యుండును.

ఈ శ్లోకమునందు ఆచార్యవాచకముగ "జ్ఞానినః—తత్త్వ దర్శినః" అని బహువచనము ప్రయోగించి వారి మహనీయతను సగౌరవముగ సూచించియున్నారు. గురువుల ననేకుల నాశ్రయించవలెనని భగవంతుని అభిప్రాయము కాదు. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు ఒక్క ఆచార్యునివలననే శిష్యునకు తత్త్వసాక్షాత్కారము కల్గగలదు. పలువురతో పనిలేదు.

శ్రద్ధయు భక్తియు సరల భావమును కలిగియున్నవాడే జ్ఞానమును బొందుటకు అర్హుడని భగవంతుడు బోధించియున్నాడు. భక్తి శ్రద్ధలు లేనివాడు గురువు చెప్పిన ఉపదేశమును గ్రహింపజాలడు. కావుననే గురుసేవా శుశ్రూషలు చేయవలెనని చెప్పిరి కాని వారికి అక్కఱపడి కాదు. సేవ చేయించుకొనవలెననెడి అభిలాష గురువుల కుండదు. ప్రశ్నలడుగువారియందును పలురకములుందురు. అభిమానముతోడను, అవిధేయతతోడను, పరీక్షింప దలంచియు ప్రశ్నించువారు నుందురు. అట్టివారు తత్త్వజ్ఞాన దేవతయొక్క అనుగ్రహమునకు పాత్రులు కాలేరు. అందువలన తత్త్వ జ్ఞానాపేక్షులు శ్రద్ధాభక్తులతో మహాత్ముల సన్నిధిని చేరి ఆత్మ సమర్పణ మొనర్చి ప్రసన్నుల నొనర్చుకొని అవకాశమును వేచి పరమాత్మ విషయకమగు ప్రశ్నల నొనర్చవలెను. అట్టి సువినీతులగు శిష్యులజూచి గురువులు, దూడను చూచి ఆవు చేపునటుల ఆత్మ జ్ఞానామృతమును స్రవింపజేతురు.

ఆవిధమున పాటుపడి సంపాదించిన ఆత్మజ్ఞానమువలన ప్రయోజనమేమో భగవంతుడు తర్వాతి ముప్పదియైదవ శ్లోకమున బోధించుచున్నాడు.

"ఓ పాండుకుమారా! వారలుపదేశించిన జ్ఞానమును అపరోక్షముగ అనుభవమునకు తెచ్చుకొన్నచో, యిప్పటివలె మోహమునకు మరి గుఱికావు. ఆ జ్ఞానముయొక్క ప్రభావముచే సమస్త భూతజాతము

నాత్మయందును తదనంతరము నాయందును జూడగలవు."

ఈ శ్లోకమునందు చెప్పిన 'యత్' పదము దేనిని సూచించుచున్నది? పూర్వ శ్లోకమునందు చెప్పిన మహాపురుషోపదిష్టమగు తత్త్వజ్ఞానమును సూచించుచున్నది. ఆ తత్త్వ జ్ఞానమును తెలిసికొనుట యననేమి? వారి ఉపదేశము ననుసరించి ప్రత్యగభిన్న పరమాత్మ స్వరూపమును సంశయ విపర్యయ రహితముగ సాక్షాత్కార మొనర్చుకొనుటకు తెలిసికొనుటయని యర్థము. మరియు మోహమునకు గుఱి కావనిన అర్థమేమి? ఇప్పటివలె వ్యామోహమునకు జిక్కి కర్తవ్యభ్రష్టుడవగు దుర్గతి మున్ముందు కల్గదు. రాత్రియందు వ్యాపించిన చీకటి సూర్యోదయమున పటాపంచలగునట్లు ప్రత్యగభిన్న పరమాత్మని యథార్థ జ్ఞానము లభించినంతట సంశయములన్నియు పంచ బంగాళమై పారిపోవును. "నేనెవరు? జగత్తేమిటి? ఈశ్వరు డెవడు? బంధమెట్లు వచ్చినది?" — ఈ యా విషయకములగు సందేహ గ్రంథులన్నియు విచ్చిపోవును. మేనే తానను కొని, ఆ శరీర సంబంధమగు వస్తువులందు తీరని మమకారముంచి, శరీరముయొక్క జన్మ మరణములను ఆత్మయం దారోపించి, దానికి కల్గెడి సుఖ దుఃఖములతో తాను సుఖిననియు దుఃఖిననియు భావించి, ఆయా నిమిత్తములచే రాగద్వేషములకు — హర్ష శోకములకు గురియై తపించుట — ఇవన్నియు మోహ వికారములు. ఆత్మజ్ఞానము సంభవించినచో యీ వికారములు నిలిచియుండవు. అస్తమించుట లేక నిరంతరము జ్ఞానసూర్యుడు ప్రకాశించుచుండ మోహాంధకారము మరి తలజూప వీలులేదు. ఈ విషయమున శ్రుతివాక్య మొండుగలదు.

"యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవాభూద్విజానతః।
తత్ర కో మోహః కశ్శోకః
ఏకత్వమనుపశ్యతః॥"

"తత్త్వజ్ఞానియగువానికి సమస్త ప్రాణులును ఆత్మభూతములగుచున్నవి. అట్టి అఖండైకపరమాత్మ దర్శనము చేసినవానికి మోహమెక్కడిది? శోకమెక్కడిది?"

గురువు లుపదేశించిన ప్రత్యగభిన్న పరమాత్మని జ్ఞానమువలన ఆత్మ సర్వవ్యాపియని యెఱిగి సర్వభూతములను ఆత్మయం దంతర్గతములుగ దర్శించవలెను. అట్లే సర్వభూతములందును భేదబుద్ధి వదలి

అన్నిట ఆత్మభావన నుంచుకొన వలెను. కలనుండి మేల్కొన్న మనుజుడు ఆ కలలోని వస్తువులు తనయందె స్మృతి మాత్రముగ కల్పింపబడినవనియు, వాస్తవముగ తనకంటె భిన్నముగ యితర వస్తువులకు ఉనికియె లేదనియు తెలిసికొనునట్లు సమస్త జగత్తును తనకంటె భిన్నము కాదని అన్నింటిని తనయందె చూడగలడు. ఇట్టి జ్ఞానమును బొందిన మనుష్యుడు శోక మోహములనుండి సంపూర్ణముగ విముక్తుడగును.

అట్టివాడు తదనంతరము సమస్త భూతములను నాయందు చూడగలడని భగవంతుడనుచున్నాడు. సంపూర్ణ భూతములను సచ్చిదానంద పరమాత్మునియందు చూచుట వెనుక చెప్పిన ఆత్మ జ్ఞానమునకు ఫలము. దీనిని పరమపద ప్రాప్తి యనియు నిర్వాణ బ్రహ్మ ప్రాప్తి యనియు చెప్పుదురు. ఈ స్థితిని పొందిన పురుషునియొక్క అహం భావము పూర్ణముగ విలయమగు చున్నది. అట్టి భగవంతునికంటె తనకు భిన్నమగు సత్తాలేదు. "ద్రక్ష్యసి" చూడగల్గుచున్నాడు; చూచెదవు అను మాటలు శాస్త్ర దృష్టితో ప్రయోగింపబడినవి. వానికి ద్రష్టృదర్శన దృశ్యములనెడి త్రిపుటియె లేదు. ఇట్టియెడ చూచువాడు చూడబడునదనెడి వ్యవహార మెట్లు సిద్ధింపగలదు? కాని ఆ మాటలను లోకదృష్టి ననుసరించి శాస్త్రము చెప్పినది. ఆభరణములు స్వర్ణరూపమే అయినట్లు జగత్తు జ్ఞాని దృష్టియందు బ్రహ్మరూపమే అయి యుండును. ఈ రీతి జ్ఞాని యొక్క పూర్ణస్థితి యీ శ్లోకమునందు వర్ణింపబడినది.

(సశేషము.)



ఓం సద్గురు పరమాత్మనే నమః.

# భగవద్గీత — ఏకాంకిక నాటకము.

## ప్రథమ రంగము — అర్జున విషాదయోగము.

రచయిత:— శ్రీ స్వామి శివానంద సరస్వతి.

అనువాదకుఁడు:— శ్రీ పి. సుబ్బరామయ్య, బి. ఏ., బి. యల్.,

అధ్యక్షుఁడు, దివ్య జీవన సంఘము, వేంకటగిరి టౌను.

[ ధృతరాష్ట్రుఁడు, సంజయుఁడు ప్రవేశము. ]

ధృతరాష్ట్రుఁడు:— సంజయా! పాండవులకు కౌరవులకు కురుక్షేత్రమున ఏమి జరిగెనో నాకిపుడు తెల్పుము.

సంజయుఁడు:— స్వామీ! దుర్యోధనుఁడు పాండవుల సైన్యమును చూచెను. అతఁడిపుడు తన గురువు ద్రోణాచార్యునితో మాటాడుచున్నాఁడు. ద్రోణుఁడు, భీష్ముఁడు, కర్ణుఁడు, తదితరులు వ్యూహాకారముగ నిలఁబడియున్నారు. యుధిష్ఠిరుఁడు, భీముఁడు, ద్రుపదాదులు యుద్ధము చేయుటకు సంసిద్ధముగ నున్నారు. దుర్యోధనుని ఉత్సాహపరచుటకుగాను భీష్మాచార్యుఁడు తన శంఖమును పూరించుచున్నాఁడు. శ్రీకృష్ణ అర్జునాదులు తమ దివ్య శంఖములను పూరించుచున్నారు. (శంఖముల ధ్వని) అర్జునుఁడిపుడు శ్రీకృష్ణుని సంబోధించుచున్నాఁడు.

తెర పడును.

[ కృష్ణుఁడు, అర్జునుఁడు ప్రవేశము. ]

పాట:—

కృష్ణ కృష్ణ నమోస్తుతే జయ విష్ణునామ నమోస్తుతే
కేశవాయ నమోస్తుతే జయ మాధవాయ నమోస్తుతే
లోకబంధు నమోస్తుతే జయ చక్రపాణి నమోస్తుతే
రాజరాజ నమోస్తుతే జయ దీనపాల నమోస్తుతే
వాసుదేవ నమోస్తుతే జయ వారిజాక్ష నమోస్తుతే
వేణులోల నమోస్తుతే జయ గోపిబాల నమోస్తుతే
వామనాయ నమోస్తుతే జయ పూతనారి నమోస్తుతే
సర్వశక్త నమోస్తుతే జయ శాశ్వతాయ నమోస్తుతే
ముక్తిదాయ నమోస్తుతే జయ శక్తిపాల నమోస్తుతే
నారసింహ నమోస్తుతే జయ పాండురంగ నమోస్తుతే

అర్జునుఁడు:— ప్రభూ! నా స్వబాంధవులే యుద్ధము చేయుటకు నా యెదుట నిలఁబడియున్నారు. నేనిపుడు నా గురువులతోను, నా బంధువులతోను యుద్ధము

చేయలేను. నా గాండీవము నా చేతినుండి జారిపోవుచున్నది. నా శరీరము కంపించుచున్నది. నాకు రాజ్యమేమియు వలదు. నా బంధువులను నేను చంపి నచో కుల సాంప్రదాయములు నశించిపోవును. అధర్మము, స్త్రీభ్రష్టత సంభ వించును. పితృదేవతాకార్యములు ఉపేక్షింపఁబడును. చంపినవాఁడు నరకము నకు పోవలసి యుండును. [విషాదముతో నేలపై దృష్టి ప్రసరించుచు కూర్చుండును.]

శ్రీకృష్ణుఁడు:— అర్జునా! ఇట్టి క్లిష్ట సమయములో నీవేల బేలవైతివి? పిఱికితనము మానుము. పరంతపా! లెమ్ము.

అర్జునుఁడు:—

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నం॥

కృష్ణం వందే జగద్గురుం
శ్రీకృష్ణం వందే జగద్గురుం

నాకిపుడు ధర్మ సమ్మూఢత ఏర్పడినది. భీష్మద్రోణులను యుద్ధమునందు బాణ ములతో నేనెట్లు ఎదుర్కొందును? వారు పూజనీయులు, వారిని చంపి రాజ్య మును బడయుటకన్న భిచ్చమెత్తుకొని జీవించెదను. నేను యుద్ధము చేయను. నిన్ను వేడుకొనుచున్నాను. నాకేది శ్రేయోదాయకమో దానిని ఖండితముగ సెలవిమ్ము. నేను నీకు శిష్యుఁడను. నన్ను శాసింపుము. నాకు బోధింపుము.

శ్రీకృష్ణుఁడు:— అర్జునా! దుఃఖింపరాని విషయములను గుఱించి నీవు మూఢుఁడవై దుఃఖించుచున్నావు. ఆత్మకు పుట్టుక లేదు. చావు లేదు. అది నిత్యము. ఈ అమృతాత్మను ఎవరును చంపలేరు. చినిగిన బట్టలను పారవేసి క్రొత్త బట్టలను ఏ విధముగ మానవుఁడు ధరించునో, ఆ విధముగ ఆత్మ జీర్ణశరీరములను వదలి క్రొత్త శరీరములందు ప్రవేశించును. అర్జునా! వివేకివి కమ్ము. అసత్యమునకు ఉనికి లేదు. సత్యము ఎన్నఁడును ఉండకపోదు, ఆయుధములు ఆత్మను ఖండింపలేవు. అగ్ని దానిని దహింపఁజాలదు. నీరు దానిని తడుపఁజాలదు. వాయువు దానిని ఎండింపఁజాలదు. అర్జునా! నీ ధర్మము నిర్వర్తింపుము. యుద్ధము చేయుము. నీవు క్షత్రియుఁడవు. అపకీర్తి తెచ్చుకొనకుము. మరణించితివా, వీరస్వర్గము పొందుదువు, జయించితివా రాజ్యము ననుభవింతువు.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

జయాపజయములలో, లాభ నష్టములలో, సుఖదుఃఖములలో సమచిత్తము గలిగి యుండుము. పాపము నిన్నంటదు. కర్మ యొనరింపుము. కాని దాని ప్రతిఫలములకై యెదురు చూడకుము.

అర్జునుడు:- గోవిందా! కరుణించి యోగయుక్తాత్ముఁడైన స్థితప్రజ్ఞుని స్థితిని నాకు ఇంకను వివరముగ వర్ణింపుము.

శ్రీకృష్ణుఁడు:- స్థితప్రజ్ఞునకు మమతాహంకారములు కోరికలు ఉండవు. తన అంతరాత్మయందు సంతృప్తితో విశ్రమించియుండును. అతఁడు రాగ భయ క్రోధములకు దూరుఁడు. అతఁడు సుఖదుఃఖములకు సముఁడు. అతనికి రాగ ద్వేషములు లేవు. అతని బుద్ధి నిలుకడయైనది. మనస్సు, ఇంద్రియములు అతనికి సంపూర్ణముగ లోఁబడియుండును. అతఁడెల్లప్పుడు తన యాత్మలో విశ్రమించును.

అర్జునుడు:- గుణముల చేష్టలను అతీతుఁడైన గుణాతీతుని లక్షణము లేమి?

శ్రీకృష్ణుఁడు:- అతఁడు గుణములచే చలింపఁడు. అవి యున్నప్పుడు వానిని అతఁడు ద్వేషింపఁడు; అవి లేనపుడు వానిని కోరఁడు. గుణములే ఇంద్రియములుగ, గుణములలో విషయములుగ సంచరించుచునని అతనికి తెలియును. అతఁడెల్లప్పుడు ఆత్మలో సుస్థిరుఁడై అచలుఁడై యుండును.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః ।
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥

అతనికి సుఖదుఃఖములు సమానములు. వానికి మట్టిముద్ద, రాయి, బంగారు సమానములు.

సమదుఃఖ సుఖ స్వస్థః సమలోష్టాశ్మ కాంచనః ।
తుల్య ప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః ॥

అతనికి ప్రియాప్రియములు, దూషణ భూషణలు, మానావమానములు, మిత్రారులు — ఇవన్నియు సమానములే.

అర్జునుడు:- కేశవా! దైవసాక్షాత్కారము పొందిన భక్తుని స్వభావము నాకు తెలియింపుము.

కృష్ణుఁడు:- అర్జునా! భక్తుఁడు ఏ ప్రాణిని ద్వేషింపఁడు. అతఁడు అందఱియెడ దయ మైత్రి కలిగియుండును. అతఁడు మమతాహంకార రహితుఁడు. అతఁడు సుఖదుఃఖములందు సముఁడై ఓర్పుకలిగియుండును. అతఁడు తృప్తితో ఎల్లప్పుడు ఆత్మ నిగ్రహము కలిగి సమచిత్తుఁడై నిశ్చలుఁడుగ నుండును. అతఁడు దృఢ నిశ్చయుఁడైన యోగి. అతఁడు తన మనోబుద్ధులను నాకంకితమొనర్చును. అతఁడు సుఖము, మాత్సర్యము, భయము, చింత — వీనినుండి ముక్తుఁడు. అతనికి ప్రపంచమన్న భయము లేదు. ప్రపంచమునకుకూడ అతఁడన్న భయము లేదు.

(మిగత 17 పుటలో చూడుడు)

# గీతా సందేశము.

రచన:— స్వామి శ్రీ శివానందజీ - ఆనందకుటీర్.

---

ఆత్మకు జన్మలేదు. అతఁడెన్నటికిని మృతినొందఁడు. అతఁడు అజుఁడు, నిత్యుఁడు, పురాణుఁడు, అవిక్రియుఁడు, అవ్యయుఁడు, దేహమును వధించినను అతఁడు మరణింపఁడు. అతఁడు సంహారింపఁడు. అతనిని సంహారింపలేము.

స్థితప్రజ్ఞునకు (అనగా జీవన్ముక్తునకు) వాసనలు, కోర్కెలు, భీతులు, మమత, అహంత, సంగము — ఇవియుండవు. అతఁడు తన స్వాత్మయందు సంతుష్టినొందును. అతఁడు ఇంద్రియసుఖములయెడ ఉపేక్షకుఁడై యుండును. వాంఛితార్థములు ఈడేరుటచే అతఁడు హర్షము నొందఁడు. అన్ని వేళలలో, అన్ని పరిస్థితులలో అతనికి సమచిత్తముండును. అతఁడు తన స్వాత్మయందే సుప్రతిష్ఠితుఁడై యుండును.

అహంకారము లేకుండ, ఫలాపేక్ష లేకుండ ఎడతెగక పనిచేయుము. జయాపజయములలో తుల్యమానసుఁడవై యుండుము. కర్మలచే, చేష్టలచే నీవు బద్ధుఁడవు గావు.

ఇంద్రియములు విషయములందు సంచరించును. చూచుట, వినుట, తాకుట, వాసనజూచుట, తినుట, పోవుట, నిద్రించుట, శ్వాసించుట, మాటాడుట, తుమ్ముట, కనులను తెఱచుట, మూయుట — ఇవన్నియు కేవలము అవయవములయొక్క పనులు (అనగా ధర్మములు.) వాస్తవములో నీవు ఇంద్రియములయొక్క చేష్టలకు, మనస్సుయొక్క వికారములకు (నీవు) సాక్షివి. స్వభావము (అనగా ప్రకృతి) అంతయు చేయుచున్నది. ఆత్మ నిష్క్రియుఁడు. సారాంశమేమన: "తత్త్వమసి" "నీవు ఆ పరమాత్మవు."

యోగమునందు మనస్సును లగ్నముగావించి ఎవఁడు సర్వజీవులందు ఆత్మను, ఆత్మయందు సర్వజీవులను చూచునో, అతఁడు సర్వత్ర *ఒకేదానిని చూచును.

ఎవఁడు ఏ ప్రాణిని ద్వేషింపఁడో, ఎవఁడు అందఱికి నేస్తుఁడై కరుణగలిగియుండునో, ఎవనికి రాగ — అహంకారములు లేవో, ఎవఁడు సుఖదుఃఖములందు సముఁడో, క్షమాశీలుఁడో, ఁడో, ధ్యాన

* పరబ్రహ్మమును.

మున ప్రస్థిరుఁడో, ఇంద్రియనిగ్రహవంతుఁడో, మనోబుద్ధులను ఈశ్వరార్పణము గావించిన దృఢనిశ్చయుఁడో, ఎవఁడు హర్షింపఁడో, ద్వేషింపఁడో, శోకింపఁడో, వాంఛింపఁడో, ఎవఁడు భక్తిపూరితుఁడో, ఎవఁడు మిత్రారులకు సముఁడో, ఎవఁడు మానావమానములలో శీతోష్ణములలో సుఖదుఃఖములలో దూషణభూషణలలో సముఁడై యుండునో అతఁడు పరమభక్తుఁడు, గుణాతీతుఁడు. అతఁడు భగవంతునకు మిక్కిలి ప్రియమైనవాఁడు.

నిస్సందేహముగ మనస్సు వాయువువలె ఉగ్రమై, విరామము లేకుండ సంచరించుచుండును. దానిని నిగ్రహించుట బహుకష్టము. కాని, అభ్యాసమువలనను, వైరాగ్యమువలనను దానిని నిగ్రహింపవచ్చును.

ఈశ్వరునిపై నీ మనస్సును నాటుము. ఈశ్వర భక్తుఁడవగుము. సర్వము ఈశ్వరునకు సమర్పింపుము. నిక్కముగ నీవు ఆయనను పొందెదవు. అన్ని చేష్టలయొక్క ఫలములను త్యజింపుము. ఈశ్వరునియందే ఆశ్రయముగొనుము. అతఁడు నిన్ను అన్ని పాపములనుండి ముక్తునిఁజేయును.

ఎచ్చోట సర్వయోగములకు అధీశ్వరుఁడైన శ్రీకృష్ణుఁడును, గాండీవధనుర్ధారియగు అర్జునుఁడును ఉందురో అచ్చోట సమస్త సంపదయు, విజయమును, సుఖమును, సౌశీల్యమును వెలయును.

---

(15 వ పుట శేషము)

అతఁడు స్వతంత్రుఁడు, పవిత్రుఁడు, సమర్థుఁడు. అతఁడు తటస్థుఁడు ఉపేక్షకుఁడు. అతఁడు కర్మలను ప్రారంభించుటయందు ఫలాపేక్షారహితుఁడు. అతఁడు హర్షింపఁడు, శోకింపఁడు, వాంఛింపఁడు, ద్వేషింపఁడు. అతఁడు నాయందు పరమభక్తిని కలిగియుండును. అతఁడు మంచి చెడ్డలకు అతీతుఁడు. అతఁడు మిత్రారులయందు, మానావమానములందు, శీతోష్ణములందు, సుఖ దుఃఖములందు, దూషణ భూషణలయందు ఒకటిగ నుండును. అతఁడు నిరపాయసుఁడు, మౌని, పరమసంతోషి, స్థిరమనస్కుఁడు. అట్టి భక్తుఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు.

అర్జునుఁడు:– కృష్ణా! స్థితప్రజ్ఞుఁడు, గుణాతీతుఁడు, పరమభక్తుఁడు – వీరందఱు ఒక్కరేయని తలంచెద. వారందఱకు ఒకే గుణములున్నవి.

కృష్ణుఁడు:– ఔను. వత్సా! నీవు చెప్పినది నిక్కము.

(తెలుపదును.)

శ్రీకృష్ణ గోవింద హరే మురారే।
హే నాథ నారాయణ వాసుదేవ॥

ఓమ్.

# శ్రీ శ్లోకసారామృతము

## ★ 15. పురుషోత్తమ ప్రాప్తియోగము. ★

రచన : శ్రీ మహర్షి మలయాళస్వాములవారు



**శ్లో॥ సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః।**
**గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః॥**

తా॥ భయంకరమగు సంసారసముద్రమును దాటుటకు నేనరుఁడుకోరుచున్నాఁడో యతఁడు గీతయను నావ నాశ్రయించినయెడల సుఖముగా తీరమునుఁ జేరుచున్నాఁడు.

పురుషోత్తముఁడనియు, భగవంతుఁడనియు, పరమేశ్వరుఁడనియు, పరబ్రహ్మమనియు చెప్పినను నొకే యర్థము. అట్టి సర్వేశ్వరునిఁ బొందుటకు తగిన పద్ధతి యీ యధ్యాయమునఁ జెప్పఁబడినందున దీనికి పురుషోత్తమ ప్రాప్తియోగమని పేరు వచ్చినది. నీయధ్యాయములో చెప్పినట్లాచరించువారికి పరమపదప్రాప్తిగలుగును. అనఁగా మోక్షము సిద్ధించును. ఆదేపురుషోత్తమ ప్రాప్తియనియు, భగవదైక్యమనియు తెలియఁదగును. అనుష్ఠానపరులందరును నీయధ్యాయమును భోజన కాలమున పఠించి భుజింతురు. అట్లు చేయువారలకు మహాపుణ్యము గలుగుననియు, పఠించనివారు భక్తితో వినుచుండినను పుణ్యప్రాప్తి నొందుదురనియు ననాదినుండియు వదంతి గలిగియున్నది. ఈ విషయమై మహాభగవద్గీత 15-వ అధ్యాయఫలశ్రుతి జూడఁదగును. మరియు కారణముగలదు. గీతలో 18 అధ్యాయములుండఁగా నీ యధ్యాయమునుమాత్ర మేల పఠించవలయును? ఇతర అధ్యాయములో దేనినైన భోజన సమయములో పారాయణ చేయరాదా, యని సందేహము గలుగవచ్చును. సన్న్యాసులందరును భోజన కాలమున దీనిని పారాయణ చేయుదురు. సన్యాసులు మాత్రము గాక బ్రహ్మనిష్ఠులందరున్ను నాలాగున నాచరింతురు. దానికి కారణమేమన, శ్లో॥ 14 లో భగవంతుఁడీలాగున నుపదేశించియున్నారు.

**శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥**

నేను జఠరాగ్ని స్వరూపుఁడనై ప్రాణుల దేహముల నాశ్రయించి ప్రాణాపాన వాయువులలోఁ గూడుకొన్నవాఁడనై ప్రాణికోట్ల భుజించెడు (భక్ష్య భోజ్య లేహ్య చోష్యములనియెడు) నాల్గు విధములగు అన్నమును పచనము చేయుచున్నాను. ఇది బ్రహ్మనిష్ఠులకు, పరమభక్తులకు చాల ముఖ్యమైన శ్లోకము. అయ్యది భోజన కాలములోఁ గూడ పంచప్రాణములకు, పంచజ్ఞానేంద్రియములకును, పంచకర్మేంద్రియములకు, పంచ

తన్మాత్రలకు నాత్మ విలక్షణ స్వరూపమని భావన చేసికొనుటకొరకేయగును. లేక నీ జీవ సంజ్ఞలతో ప్రకాశించువాడు కేవలము భగవత్స్వరూపుఁడే. అట్టి ఆత్మైక్యానుసంధానపరులై యుండవలెనను యర్థము దీనియందు స్ఫురించుచున్నది. మరియు భోజన కాలమున నీ యధ్యాయము పారాయణ చేయుట విషయమై, శ్రీమహాభగవద్గీతయందు కారణము చెప్పఁబడెను. అట్లు నొక్క యధ్యాయమునకే గాక ప్రతి యధ్యాయమునకును పారాయణ ఫలమున్ను దానికి కారణమున్ను నిరూపించడమైనది. ఈ వ్యాసమతిసంక్షిప్త విషయమగుటచే దానిని నిట వ్రాయ లేదు. దానియందు నీ యధ్యాయముయొక్క మాహాత్మ్యముగూడ గనఁపగును. దీనిలో మొదటనే ప్రపంచవృక్షముయొక్క వర్ణన చేయఁబడినది. అట్టి సంసారవృక్షమును నరికివేసిన మాత్రమే జననమరణ దుఃఖములు నశించి, జీవుఁడు మోక్షము నొందగల్గును. ఆ విషయములన్నియుం దీనిలో విశదీకరింపఁబడియున్నవి. ముఖ్యముగా సంసారవృక్షము అనఁగా నజ్ఞానవృక్షము యెట్టిదో, దానిని నఱికెడి గొడ్డలియెట్టిదో ముముక్షువులు తెలిసికొనదగినది. వృక్షములన్నింటికిని మూలము క్రిందుగాను, అగ్రము పైగాను నుండును. ఈ సంసార మహావృక్షమునకు మొదలు పై భాగమునను, అగ్రము క్రిందభాగమునను నుండునని శ్రీ భగవానులు వర్ణించిరి. ఇది యాశ్చర్యకరము. ఈలాగున నెచ్చటనైనా యుండునా? ఇదియే దీనిలోఁగల మర్మము. ఆత్మచింతకులందరున్ను, పరమభక్తులందరున్ను యీ రహస్యమును తెలిసికొనవలెను. స్వయముగా తెలిసికొన శక్తిలేనివారు ఉత్తమ గురువులవలననైనను గ్రహించుకొనవచ్చును. కనుకనే ప్రారంభములోనే "ఊర్ధ్వమూలమధశ్శాఖ" మని ఆరంభించిరి. ఈ వ్యాసములో దేనికిని ప్రమాణశ్లోకములు వ్రాయగూడదని తలంచడమైనది. ఏలన గ్రంథము పెరిగిపోవును. అయినను నిది యమూల్యవిషయమగుటచేతను ముముక్షువులు ముఖ్యముగా తెలిసికొనఁదగిన దగుటచేతను శ్రుతిస్మృతులందలి రెండువాక్యములు మాత్రము వ్రాయఁదలంచడమైనది. ఆ సంసారవృక్ష మెటువంటిదో, యిట వర్ణింపఁబడుచున్నది.

శ్లో॥ అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః ।
బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతరకోటరః ॥
మహాభూతప్రశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా ।
ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః ॥
ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః ।
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మ చరతి నిత్యశః ॥
ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా ।
తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః ॥

తా॥ అవ్యాకృతము (మూలప్రకృతి లేక మాయ) అనెడు వేరునుండి పుట్టి, యీవేరు గట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియు, బుద్ధియనెడు ప్రకాండముగలదియు, నేత్రేంద్రియాది రంధ్రములే తొఱ్ఱలుగాగలదియు, పృథివ్యాది పంచభూతములే పెద్దకొమ్మలుగాగలదియు, శబ్దాదివిషయములే యాకులుగా గలదియు, ధర్మాధర్మములనెడు మంచిపువ్వులు గలదియు, సుఖదుఃఖ పుణ్యాపాపములనెడు పండ్లుగలదియు, వృక్షము పక్షులకువలె సమస్తప్రాణులకు జీవనాధారమైనదియు, చిరకాలమునకు బ్రహ్మజ్ఞానము గలిగినపిమ్మట బోవునదియగుటంబట్టి బహు పురాతనమైనదియునగు బ్రహ్మమే యధిష్ఠానముగాఁ గనబడు నీ సంసారమనెడు వృక్షమే పరమాత్మకు విహారస్థానముగ వనమైయున్నది. అవ్యక్తమనియు, అవిద్యయనియు, ప్రకృతియనియు, ప్రధానమనియు, మాయయనియు, అజ్ఞానమనియు చెప్పిన నొకే యర్థము.

ఓం తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్. అన్నాత్పురుషః, (తైత్తిరీయోపనిషత్తు.)

తా॥ ఆత్మశబ్దవాచ్యమును, సత్యజ్ఞానానంద స్వరూపమునగు ఆ పరబ్రహ్మము నుండి సమస్తభూతములకును నవకాశమునిచ్చుచున్న ఆకాశము పుట్టినది. ఆకాశమునుండి వాయువును, వాయువునుండి యగ్నియు, అగ్నినుండి జలమును, జలమునుండి పృథివియు, పృథివినుండి తరుగుల్మలతాదులును, సమస్తసస్యములు స్వరూపములుగాగల ఓషధులును పుట్టినవి. ఆ యోషధులవలన నన్నము పుట్టినది. రేతోరూపముగా పరిణమించిన యా యన్నములవలన శిరస్సు, హస్తము మొదలైన యవయవములతో గూడిన యాకృతిగల పురుషుఁడు పుట్టెను. భగవంతుఁడుపదేశించిన యిది చాలా రహస్యమైనది. మూలప్రకృతి నుండియే యీ సృష్టిప్రారంభమైనదియు, నట్టి మూలావిద్యను ఛేదించిన మాత్రమే యజ్ఞానవృక్షము నశించుననియు, ఈశ్వర సాక్షాత్కార జ్ఞానమువలన మాత్రమే దానికి వినాశము గల్గుననియు వచించిరి. భోజనకాలములో నిట్టి పవిత్రపారాయణమువలన నందరి మనస్సు ఈశ్వరవిషయములో మగ్నమై యుండును. అట్లాగున భుజించెడి అన్నాది పదార్థము లతిపవిత్రమైయుండును. అట్టి అన్నపానాదులచే హృదయము చాలా నిర్మలత్వము నొందును. భోజనసమయములో నెవడెట్టి భావము గలిగియుండునో, అట్టి గుణమాతనికి తప్పక గలుగునని దివ్యదృష్టిగల వారి యాశయము. కావుననే మంత్రపూతముగా నొనర్చి భుజింపవలయునని చెప్పెడి రహస్యము. అట్టి దివ్యమంత్రములు జపించవలసి యుండుటచే నితరములగు వ్యర్థవాక్యములుగాని తలంపులుగాని చేరుటకు నవకాశముండదు. ఋషులందరును మంత్రముల సృష్టించుట కిదియే కారణము. కనుకనే భోజనము కొంతరహస్యస్థలములో చేయవలయు ననియు, ఆ సమయములో మాట్లాడ గూడదనియు నేర్పరచిన రహస్యము. స్వయముగా

దైవభావము గలిగియుండుట సామాన్యులకు దుస్తరమని తలంచి మంత్రము లేర్పరచిరి. కాలమహిమచే నిప్పుడట్టి మంత్రములను జపమొనర్చి భుజించువారు నరుదైరి. ఒకవేళ కొందరు నుచ్చరించుచున్నను మనస్సులో నీశ్వరభావము లేకపోవుచున్నది. అందువలననే నట్టియన్నాదులు దుష్పరిణామము బొంది, వానివలన నేర్పడు స్త్రీపురుష శుక్ల శోణితములు నశుద్ధములై, అందువలన పుట్టెడి బిడ్డలు యశస్సున్ను, ఓజస్సున్ను లేనివారగుటకున్ను అధర్మ ప్రవర్తకులగుటకున్ను కారణమగుచున్నది. మంత్రములను మాత్రమొకవేళ యుచ్చరించుచుండినను భావము లేకపోయిన, అదిన్ని నంతఫలమును కలుగఁజేయదని జ్ఞాపకముంచుకొనవలెను. కనుకనే వాచ్యవాచకముల యైక్యము గలిగియుండవలెనని చెప్పెడి రహస్యము. వాక్యమునకన్న భావమే గొప్పదైనను, నట్టి మంత్రము లేనిచో భావముకూడ చేయరని తలంచి కరుణామూర్తులగు పరమ ఋషులు మంత్రములను కూడ పఠించవలెనని నిర్ణయించిరి. కలికాల మహిమచే నిది యాచరించువారే లేకపోయిరి. ఈ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యము.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥

"ధ్యానాదులచే బ్రహ్మస్వరూపమునుఁ దెలిసికొనుటకు ప్రయత్నము చేయుచున్న ధ్యానయోగులు (జ్ఞానులు) తమయందున్నట్టి యీ యాత్మను దర్శించుచున్నారు. ధ్యానభజనాది ప్రయత్నములు చేయుచున్నను చిత్తశుద్ధిలేని యవివేకులు ఈ యాత్మను తెలిసికొనఁజాలకున్నారు,

---

ఓమ్.

## పంచదశాధ్యాయ మాహాత్మ్యము.

శ్లో॥ కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్ కౌన్తేయ ఏవ చ ।
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః ॥

తా॥ భగవద్గీతయొక్క సంపూర్ణార్థము శ్రీకృష్ణభగవానుడొక్కడే యెరుగును. అర్జునుడున్ను, వ్యాసుడున్ను, శుకదేవుడున్ను, యాజ్ఞవల్క్యుడున్ను, జనక మహారాజున్ను కొంచెము కొంచెముగా తెలుసుకొనియున్నారు. ఇట్లుండగా, సామాన్య మనుజుడు ఈ గీతార్థమును యెట్లు సంపూర్ణముగ తెలిసికొనగలడు?

ఈ పంచదశాధ్యాయమునుగూర్చి నొక యితిహాసముగలదు. అదేమనగా ఒక యగ్రహారమున నిద్దరు బ్రాహ్మణులు భోజన కాలమున గీతాపారాయణమును చేసి భుజించు స్వభావముగలవారై యుండిరి. వారుభయులున్ను గొప్పశాస్త్రవేత్తలు.ఒకరోజు

సుమారు ప్రయాణమార్గములోగల భూపాలుని దగ్గరకువెళ్ళి తమపాండిత్యమును ప్రదర్శించి గొప్ప బహుమతిని పొందదలంచి యుభయులున్ను రాత్రి నాలుగవ యామారంభములో స్నానమాచరించి అన్నము కట్టుకొని పయనమయిరి. మధ్యాహ్నమున నొక అడవి మధ్య ప్రదేశమున జేరిరి. అచ్చోట మంచి జలాశయమున్ను వృక్షఛాయయు యుండెను. వారు స్నానమాచరించి మాధ్యాహ్నిక క్రియలసల్పి బాగుగా ముదిరిన యొక మఱ్ఱిచెట్టు క్రింద కూర్చుండి భోజనమునకు ప్రారంభించక ముందుగా శ్రీభగవద్గీత పంచదశాధ్యాయమును పఠింప ప్రారంభించిరి. వీరు ప్రతిరోజున్ను గీత యొక్కొక్క యధ్యాయమును పారాయణజేసి భుజించు స్వభావముగలవారని పైన తెలుపబడినదికదా! ఆదినము పంచదశాధ్యాయమే వచ్చెను. శ్రీగీతాపారాయణము కొంతవరకు సాగినప్పుడు ఆవృద్ధవటవృక్షము ఫెటఫెటా యని పగిలి దానినుండి పెద్దధ్వని యొకటి బయలుపడుటయు, ఆ మ్రానునుండి గొప్పప్రకాశముతోగూడిన యొక దివ్యపురుషు డావిర్భవించుటయు చూచిరి. ఈ ఆశ్చర్యమును బ్రాహ్మణులుచూచి విభ్రాంతులై పరస్పరము విచారించుకొనుచుండగా ఆ దివ్యపురుషు డీలాగున భక్తితో వారిని నమస్కరించి చెప్పందొడగెను. ఓ మహాత్ములారా! నేనొక గంధర్వుడను. నాయొక్క రూపలావణ్యమును గానవిద్యా ప్రావీణ్యమును చూచి గర్వించి, మదించి, దూర్వాస మహామునిని చూచి పరిహాసముతో నవ్వితిని. అప్పుడు ఆ మహాముని సత్తముడు, కోపించి బ్రహ్మరాక్షసుడవుకమ్మని శపించెను. తత్క్షణమే నేను బ్రహ్మరాక్షసునిగా యయితిని. మరల యపరాధము క్షమింపుమని ఆ మహాత్ముని వేడుకొనగా ఆ మహర్షి శాంతినొంది శ్రీభగవద్గీత పంచదశాధ్యాయము నీవెప్పుడు మంచి యనుష్ఠానము గలవారివలన శ్రవణము జేయుదువో అప్పుడు శాపవిమోచనము గలుగునని యాశీర్వదించెను. అప్పటినుండి ఈ వటవృక్షమున చాలా బాధలను సహించి వాసము చేయుచున్నాను. శాపాగ్నిచే దహింపబడుచుండువాడను. యిచ్చట యుండుటకు కారణమేమన ఈ సరోవరములో అనేక బాటసార్లు స్నానమాచరించి జప ధ్యాన గీతాపారాయణాదులనుచేసి భుజింతురు. ఇదివరలో అనేకులిచట గీతాపారాయణము, సుందరకాండపారాయణము, దివ్యమంత్ర జపములనుజేసి భుజించి వెళ్ళిరేకాని ఎవరున్ను యీ పంచదశాధ్యాయ పారాయణ చేసియుండలేదు. మహాత్ములగు మీరు గీత పదునేనవాధ్యాయ పారాయణము జేయుదానిని నేను ఏకాగ్రముతో వింటిని. అందుచే నాకు శాపవిమోచనము గల్గినది. నేనిప్పుడు స్వర్గలోకమునకు పోవుచున్నాను. అయితే కరుణాస్వరూపులగు మీరు నాకింత పుణ్యము గలుగజేసినందుకు మీకు ప్రత్యుపకారముగా యొక యుపకారము చేసెద. మీరు పోవుచుండు విషయము నాకు తెలియును. మీరు రాజును దర్శించి సంభావనకొరకు వెళ్ళుచున్నారు. మీరు దేనిని కోరెదరో దానిని మీకిచ్చులాగున రాజుయొక్క జిహ్వాగ్రముననుండి పలికించెదను. భూపాలునకు హృదయ సంతోషము గలుగులాగున చేసెదనని చెప్పి ఆ గంధర్వుడదృశ్యుడాయెను. విప్రోత్త

ములు రాజుగారి సభలో ప్రవేశించి తమ శాస్త్రప్రభావమున్ను, ప్రయోజనమున్ను చూపగా ఆ మేదినీపతి, ఆత్యాశ్చర్యము నొంది వారికి గొప్పదగు నొక యగ్రహారమును ఆచంద్రార్కముగా అనుభవించులాగున దాన మొసగి తామ్ర శాసనముగూడ వ్రాసి యిచ్చెను. శ్రీభగవద్గీత పంచదశాధ్యాయ పారాయణ ఫలమీలాగున యుంటున్నది. కావుననే పెద్దలందరు ఈ పదునేనవాధ్యాయ పారాయణజేసి భుజించుటకు కారణము.

ఓమ్ తత్ సత్.

# గీ తా గా న ము.

( "పావన గుణ రామా ... హరే!" అను వర్ణమెట్టు )

పావన గీతా మాతా నమో

భక్తహృదయ వాసీ నమో ॥పా॥

మాయాతీత మనోజ్ఞ ... మాయా రహితా ... మాన్య సుచరిత బాయక నామది – యందు వసించి ... బావగదే ... పరి తాపములన్నియు ॥పా॥

పార్థుని బ్రోచినరాణీ! .... భక్తపాలినీ – పంకజనేత్రీ !! శ్రుతి సీమల – చెలువారెడు జననీ! – శుద్ధాంతఃకరుణామృతదాయినీ!! ॥పా॥

( "అమ్మ కావుమమ్మ – ఆదిశక్తి – శంకరీ!..." అను వర్ణమెట్టు )

గీతామాత ! పూరితచరిత !!

ప్రీతితోడ – బ్రోవుమా ... ॥గీ॥

పాతకహారిణి నాదు ... పాపము లెడబాపి నీదు – దాపుజేర్చి దయను చూపి ... కాపాడగ రాగదమ్మా ... ॥గీ॥

హృదయ కమలమందు వెలసి ... మదిని భక్తిజ్ఞాన మొసగి సదమల మతితోడ మాకు ... శాంతి సౌఖ్యమొసగు మమ్మా ॥గీ॥

చెంచులక్షుమ్మ, వేంపల్లె.





# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము
శ్రీ. కిళాత్తూరు - శ్రీనివాసాచార్యులు

[ 1954 నవంబరు సంచిక 28-వ పుట తరువాయి. ]

భాష్యం:- అజ్ఞానకృతభేద దృష్టివాదే తు పరమపురుషస్య, పరమార్థదృష్టేః నిర్విశేష-కూటస్థ-నిత్యచైతన్యాత్మ యాథాత్మ్య సాక్షాత్కారాత్ నివృత్తాజ్ఞాన తత్కార్యతయా, అజ్ఞాన కృతభేదదర్శనం తన్మూలోపదేశాది వ్యవహారాశ్చ న సంగచ్ఛన్తే.

అనువాదము:- అజ్ఞానమువలననే ఆత్మభేద దర్శనము సంభవించుచున్నదను (శంకర) మతమున:- పారమార్థిక దృష్టిగల పరమపురుషుడు భేదరహిత-కూటస్థ-నిత్య-చైతన్యమైన ఆత్మయొక్క స్వరూపమును సాక్షాత్కరించినవాడగుటచే - అజ్ఞానమువలన కలిగిన భేదదృష్టికాని-అట్టి భేద దర్శనము నాధారముగ జేసికొన్న ఉపదేశాది వ్యవహారములు కాని (అతనికి) సరిపడవు.

విశేషార్థము:-జీవాత్మ, పరమాత్మయని ఆత్మ భేదము లేదు. సర్వకాల-సర్వదేశ-సర్వావస్థలలోనున్నది (పరమాత్మ) బ్రహ్మమొక్కటే యనునది శంకరుని సిద్ధాంతము. అట్లయిన - గీతోపదేశము చేయవలసిన ప్రమేయమే లేదుకదా? ఎందుకనగా:- క్షేత్రజ్ఞులైన మనబోటివారికి జీవాత్మ పరమాత్మ మొదలగు భేదములు కనబడునేకాని-సర్వమును బ్రహ్మముగా చూచుచున్న పారమార్థిక దృష్టిగల శ్రీకృష్ణపరమాత్మకు, ఆ సర్వములో కలసిన అర్జునుడుకూడా తానుగా నుండగా - అతనికెట్లుపదేశింపబూనును? అజ్ఞానముచే అర్జునుడనే రెండవ వ్యక్తి కనబడెనన్నచో, శ్రీకృష్ణుడు పరమాత్మ యెట్లు కాగలడు? అతనికి అజ్ఞాన మెచ్చటనుండి వచ్చినది? అట్టివాని యుపదేశము కూడా అజ్ఞాన పూరితమై యుండునుకదా? కనుక జీవాత్మ పరమాత్మలకు పరస్పరభేదము వాస్తవమైనందున సర్వజ్ఞుడైన శ్రీకృష్ణపరమాత్మ

కించిత్ జ్ఞుడైన అర్జునునికి ఉపదేశించుటయు క్తిసంగతమగునని శ్రీభాష్య కారుల తాత్పర్యము. "కూటస్థం" = ఎట్లుస్వర్ణకారుడు బంగారు వెండి మొదలగు ధాతువులను మూసలోనుంచి పుటము పెట్టగా ఆ మూసకరుగక అందులోని ధాతువు మాత్రము కరుగునో అట్లే సర్వ జగత్తుకు జనన మరణ నామరూపాద్యనేక వికారములు కలిగినను పర మాత్మ తత్త్వము యెట్టి వికారమును (మార్పును) పొందకయే యున్నదనెడి తాత్పర్యము నిచ్చునదియే "కూటస్థ" పదము.

భాష్యం:- అథ పరమపురుషస్య అధిగతాద్వైతజ్ఞానస్య బాధితానువృత్తి రూపమిదం భేదజ్ఞానం దగ్ధపటాదివత్ న బంధకమిత్యుచ్యతే_నైతదుపపద్యతే; మరీచికాజల జ్ఞానాదికం హి బాధితం అనువర్తమానం న జలాహరణాది ప్రవృత్తి హేతుః। ఏవం అత్రాపి అద్వైతజ్ఞానేన బాధితం భేదజ్ఞానం అనువర్తమానమపి మిథ్యార్థ విషయత్వ నిశ్చయాత్ న ఉపదేశాది ప్రవృత్తి హేతుః భవతి.

అనువాదము.- మఱియు అద్వైతజ్ఞానమును పొందిన పరమపురుషునికి బాధితానువృత్తిరూపమైన ఈ భేదజ్ఞానము దగ్ధపటాదులవలె బంధ హేతువు కాజాలదనిన చో_ఇదియు పొసగదు. (ఎందుకనగా) ఎండ మావును జూచి కలిగెడి జలజ్ఞానము, "ఇది జలము కాదు"అనుజ్ఞాన ముచే బాధింపబడి, అనువర్తించుచున్నను జలాహరణ ప్రవృత్తికి కార ణము కాజాలదు. అట్లే యిచ్చటకూడ_ అద్వైతజ్ఞానముచేత బాధింప బడిన భేదజ్ఞానము అనువర్తించుచుండినను అవాస్తవిక విషయమని నిశ్చయమున్నందుచే ఉపదేశాది ప్రవృత్తికి కారణము కాజాలదు.

విశేషార్థము:— ఇచ్చట పూర్వపక్ష మేమనగా:_ కాలిపోయిన వస్త్రము దూరమునుండి చూచుటకు వస్త్రముగానే కనబడుచున్నందున మొదట "వస్త్రము"నియే జ్ఞానము కలుగుచున్నది. తరువాత సమీ పమున చూడగా "ఇది వస్త్రము కాదు." అను బాధక జ్ఞానము కలుగుచున్నది. ఇట్టి బాధక జ్ఞానముచేత "ఇది వస్త్రము" అనే మొదటి జ్ఞానము బాధితమగుచున్నది. ఈ విధముగా బాధింపబడినను "ఇది వస్త్రము" అను జ్ఞానము ఎట్లు అనువర్తించుచున్నదో - అట్లే అద్వైత జ్ఞానమును పొందిన పరమాత్మకు, భేదజ్ఞానము బాధింపబడి నను అనువర్తించుచున్నది కనుక ఉపదేశమున కేమి యాటంకము?

సిద్ధాన్తము:— మీ దృష్టాంతము సరిపోయినది. కాని అందుకు ఉపపత్తి మాత్రము లేదు. మఱియు అనుపపత్తికూడా వున్నది. ఎట్లన, దగ్ధవస్త్రమును చూచి కలిగిన వస్త్రజ్ఞానము బాధితమై అనువర్తించినను శరీరగోపనాది వ్యాపారమునకు పనికిరానందుచే, దగ్ధపటమును యెత్తుకొనుటకు ప్రవృత్తి కలుగదు కదా?

మఱియొక దృష్టాన్తము:— ఎండమావును చూచి "ఇది జలము" అను జ్ఞానము కలిగి, తరువాత "ఇది జలము కాదు" అను బాధక జ్ఞానము కలిగి_దానిచే బాధింపబడి_మరలను "ఇది జలము" అనే జ్ఞానము అనువర్తించుచున్నను, "ఇది జలము కాదు" అనే నిశ్చయజ్ఞానము కలిగియున్నందుచే _ ఆ వ్యక్తి యెట్లు నీరు దెచ్చుటకు ప్రయత్నింపడో అట్లే అభేద నిశ్చయముగల పరమాత్ముడు భేదజ్ఞానము అనువర్తించుచున్నను_ఉపదేశమునకు ప్రవర్తింపడు. తానే అర్జునుడై, అర్జునుడే తానుగా నిశ్చయించినవాడు ఎట్లుపదేశింపబూనునని భావము.

భాష్యం:_ న చ ఈశ్వరస్య పూర్వమజ్ఞస్య శాస్త్రాధిగతత్త్వజ్ఞానతయా బాధితాను వృత్తిః శక్యతే వక్తుమ్ – "యః సర్వజ్ఞః సర్వవిత్" "పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ॥" "వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున। భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన" ॥ ఇతి శ్రుతి స్మృతి విరోధాత్ ।

అను:— అట్లుకాదు. ఈశ్వరుడు మొదట అజ్ఞానిగాయుండి మరల శాస్త్రాధ్యయనమువలన తత్త్వజ్ఞానము గలిగినవాడగుటచే అతనికి బాధితమైన అజ్ఞానము అనువర్తించునని చెప్పుటకు వీలున్నది గదా? యనిన - అదియు పొసగదు. ఎందుకనగా _ "ఎవ్వడు సర్వజ్ఞుడో అతడు సర్వమెఱింగినవాడు" "ఇతని గొప్పశక్తి వివిధమనియు, ఇతని జ్ఞానబలక్రియలు స్వాభావికములనియు వింటున్నాము" "అర్జునా! నేను గడచినవానిని,జరుగుచున్నవానిని, జరుగబోవువానిని తెలిసినవాడను. కానినన్నెవడు నెరుగలేడు."ఇవి మొదలుగా గల యనేకశ్రుతులకును, స్మృతులకును విరోధము గలుగుచున్నది.

విశే:_ మొదట అజ్ఞానము కలిగినవాడు ఈశ్వరుడే కాడు. అట్టి యీశ్వరుడొకడుండినను _ అతనికంటే గొప్పవాడుండినకదా - ఆ వ్యక్తి ఈశ్వ

రునికి శాస్త్రములను బోధించుటకు? ఒకవేళ అతడుండినను అతనికి మొదట తత్త్వజ్ఞానముండినదా? లేదా? తత్త్వజ్ఞానము కలిగినదన్నచో అతని కుపదేశించినవాడెవ్వడు? ఈ విధముగా ముగింపులేని అనవస్థా దోష దూషిత మీపూర్వపక్షమని శ్రీవేదాంత దేశికులు వివరించిరి.

భాష్యం:- కించ, పరమపురుషశ్చ, ఇదానీన్తన గురుపరంపరా చ అద్వితీయాత్మనిశ్చయే సతి, అనువర్తమానేఽపి భేదజ్ఞానే, స్వనిశ్చయానురూపం అద్వితీయాత్మజ్ఞానం కస్మై ఉపదిశతి? ఇతి వక్తవ్యం.

అను:- మఱియు, పరమపురుషుడును, ఇప్పటి గురుపరంపరయు, ఆత్మైకత్వ నిశ్చయము కలిగిన పిదప, భేద జ్ఞానము అనువర్తించుచున్నను తన నిశ్చయమునకు తగినట్టి అద్వైతాత్మ జ్ఞానమును ఎవరి కుపదేశించును? అనుదానికి (ప్రత్యుత్తరము) చెప్పవలెను.

విశే:- ఇంతవరకు, ఆత్మ యొక్కటే యన్నచో ఉపదేశము పొసగదని నిరూపింపబడినది. ఇప్పుడు ఉపదేష్టగా యుండుటకూడ తగదని నిరూపించబడుచున్నది. అది యెట్లనః- ఉపదేశము జేయబూనిన శ్రీకృష్ణ పరమాత్మకు గాని - గురుపరంపరకు కాని అద్వైతాత్మ స్వరూప నిశ్చయము కలిగిన పిదప సర్వమును తానుగా నుండగా యెవరి కుపదేశించుట? కనుక ఉపదేష్ట్రృత్వము కుదరనందుచే, మఠాధిపతి పరంపరయు, శిష్యార్జున జీవులును ప్రాయోపవేశము చేయవలసిన పరిస్థితి సంభవించునని భావము.

భాష్యం:- ప్రతిబింబవత్ ప్రతీయమానేభ్యః అర్జునాదిభ్యః ఇతి చేత్ - నైతదుపపద్యతే; న హి అనున్మత్తః కోఽపి మణికృపాణ దర్పణాదిషు ప్రతీయమానేషు స్వాత్మప్రతిబింబేషు తేషాం స్వాత్మనః అనన్యత్వం జానన్ తేభ్యః కిమప్యుపదిశతి॥

అను:- "ప్రతిబింబమువలె కనబడుచున్న అర్జునాదుల కుపదేశించుచున్నాడనినచో - అదియును పొసగదు. పిచ్చి పట్టనివాడెవ్వడును మణి, కత్తి, అద్దములలో కనబడుచున్న తన ప్రతిబింబములను చూచి అవి తనకంటె వేఱుకావని తెలిసినపిదప, వానికి దేనిని యుపదేశింపడు కదా? (అనగా పిచ్చి పట్టినవాడే తన ప్రతిబింబమున కుపదేశించును.)

(సశేషము.)

# వార్తలు.

శ్రీ శంకరజయంతి సప్తాహ మహోత్సవములు ఏప్రెల్ నెల 26వ తేదీ వైశాఖ శుద్ధపంచమి మంగళవారముతో ప్రారంభమైనవి. శ్రీ శంకరానందాశ్రమమునందు శ్రీ శంకరజయంతీ మహోత్సవములు జరుపబట్టి పదిరెండేండ్లయినది. ప్రతిదినమును బ్రహ్మముహూర్తమున మాతృశ్రీ సుబ్బలక్ష్మమ్మ-చిన్నమ్మగార్లచేత నగరసంకీర్తనము నిర్వర్తింపబడినది. తదనంతరము శ్రీశ్రీశ్రీ అశేషానందస్వాములవారు సామూహిక భగవద్గీతా పారాయణము చేయించెడివారు.

ఉపన్యాస కార్యక్రమ ప్రారంభమున శ్రీశ్రీశ్రీ రామకృష్ణానంద స్వాములవారు శ్రీ భాగవత తత్త్వప్రవచనమును కావించినారు. తర్వాత శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారు భక్తినిగూర్చి ముచ్చటించినారు. ఆహ్వాన పత్రికయందు పేరును ముద్రింపకున్నను అధికసమాదరముచే ఈ జయంతియందు పాల్గొనుటకై బ్రహ్మశ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి M. A., B. L. గారు విచ్చేసి ప్రథమదినమున పూర్వాహ్ణమునసే సహజగంభీర వాగ్ధాటితో శ్రీ శంకరవిజయమును గూర్చి ఉపన్యసించినారు. తర్వాత సాయంకాలమున శ్రీ అశేషానంద స్వామివారు ఉపనిషత్తును గూర్చియు, ఆశ్రమాధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ శంకరానంద స్వాములవారు భగవద్గీతను గూర్చియు ఉపన్యసించినారు.

ఈ సప్తాహ మహోత్సవమునందు శ్రీ శ్రీ శ్రీ నిత్యానందస్వాములవారును, శ్రీ ఆనందనాథ స్వామివారును, మాతృశ్రీ చిన్నమ్మగారును, శ్రీ సి. పి. తిమ్మారెడ్డి M. L. A. గారును, బ్రహ్మశ్రీ మల్లికార్జున శాస్త్రిగారును తమ మహోపన్యాసములతో సభికుల నానందపరవశులనొనర్చినారు. కొన్ని అనివార్య పరిస్థితులతో ఆహ్వాన పత్రికలలో ప్రకటించిన, బ్రహ్మశ్రీ సాధు లక్ష్మీనృసింహశర్మగారును, శ్రీ బాలయోగిగారును, శ్రీ గీతానంద గారును, మాతృశ్రీ లంకా భాగీరథమ్మగారును పాల్గొనజాలక పోయినారు.

శ్రీ శంకరజయంతి సప్తాహములను జరుపుకొని శ్రీ శంకరానందస్వాములవారు పాలూరు గ్రామము (కడపజిల్లా) చేరినారు. అచ్చట వారముదినములు ఉపన్యాసములు జరిగినవి.

మేనెల 14-15-16 తేదీలలో పుంగనూరు తాలూకా సదుము గ్రామమునందు శ్రీ శంకరానంద రామకృష్ణులు గీతోపన్యాసము లొనరించినారు.

మేనెల 14-15-16 తేదీలు పుంగనూరు తాలూకా సదుము గ్రామములోను, 17-18 తేదీలు మదనపల్లిలోను ఉపన్యాస కార్యక్రమమును జరుపుకొని శ్రీ శంకరానంద-రామకృష్ణ స్వాములవారలు 20వ తేదీకి పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లు చేరుకొందురు. అచ్చట సుమారు పక్షము రోజులు ఉపన్యాస కార్యక్రమ ముండగలదు.

*   *   *



# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు॥ 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు – 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదుర్తి, – 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డి ఎం.ఎల్.ఏ. గారు, నాగిరెడ్డిపల్లె, – 4. స్వర్గీయ నేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీలక్ష్మమ్మగారు, నంద్యాల. – 5. శ్రీవంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, – 6. శ్రీపగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, – 7. శ్రీతొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. – 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, ఎం. కృష్ణాపురము, – 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. – 10. స్వర్గీయ శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, – 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. – 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల,

కడపజిల్లా: 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, – 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్.ఎస్. – 15. శ్రీపోశెట్టిపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

అనంతపురం జిల్లా; 16. పూజ్యపాద శ్రీ చిద్ఘనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. – 17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 18. శ్రీ పి. నరసింహశాస్త్రిగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 19. శ్రీ మదనపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, చిత్తూరు. – 20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, చిత్తూరు.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, నెల్లూరు. – 22. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

కృష్ణాజిల్లా: 24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. – 25. శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణరావుగారు, సర్కిల్ పేట, బందరు. – 26 స్వర్గీయ బావినేని నవరత్నం స్మారకముగ తలిదండ్రులు బావినేని రామకోటయ్యచౌదరి – రాజేశ్వరమ్మగారు, శ్రీ పరమాత్మానందాశ్రమము, శ్రీగీతాభవనము, పెనమలూరు.

తూర్పుగోదావరి జిల్లా: 27. శ్రీ సమతమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి. – 28. శ్రీ సమతమంతుల ప్రకాశంగారు – సుబ్బమ్మగారి స్మారకముగ కుమారుడు శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి – 29. స్వర్గీయ సమతమంతుల మాణిక్యమ్మ కుమారుడు రామకృష్ణగారి స్మారకముగ తండ్రి శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి. – 30. శ్రీమాగంటి వెంకటరత్నం – శేషమ్మగార్ల స్మరణార్థం కుమారుడు జగ్గారావుగారు ర్యాలి. – 31. శ్రీ సమతమంతుల సత్యనారాయణ – వెంకటసుబ్బమ్మగార్ల స్మారకముగ శ్రీ నాగేశ్వరరావుగారు, రాధాకృష్ణరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా: 32. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు,పాలకొల్లు. — 33. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ — భర్త శ్రీ సత్యనారాయణమూర్తి ఎం. ఎల్. ఏ. గారు, పాలకొల్లు.

నైజాంస్టేట్: 34. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. — 35. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ — 36. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

మైసూరుస్టేట్: 37. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్ — 38. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పేట — 39. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెర. — 40. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, — 41. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, బెంగుళూరు సిటి.

మద్రాస్ రాష్ట్రం: 42. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానల్లూరు, — 43. శ్రీగంథే నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపురాజుగారు, గోనపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె.— 9. శ్రీ N. రామిరెడ్డిగారు,డబ్ల్యు. కొత్తపల్లె. — 10. శ్రీ మదల్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీజూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు,చాగలమర్రి. —12. శ్రీమతి ఆర్.సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. — 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, పాణ్యాం. — 16. శ్రీ కాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరు. — 17. శ్రీ జి. పి. బాలన్నగారు, ఆళ్లగడ్డ. — 8. శ్రీ యం. చిన్నఈశ్వరరెడ్డిగారు, ఐలూరు, 19. శ్రీ కృష్ణం గురవయ్యశ్రేష్ఠిగారు, మర్చంట్, చాగలమర్రి. — 20. ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారి స్మరణార్థం భర్త మాఖం సుబ్రమణ్యంగారు, నంద్యాల.

కడప జిల్లా: 21. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు. — 22. శ్రీ ఎస్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. — 23. శ్రీ మిట్టానారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 24. శ్రీ కొంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు

వేంపల్లి. — 25. శ్రీ గల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 26. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు.

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 28 శ్రీ బాసెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి. — 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ కావాల గోవిందప్పగారు, కుందనగుర్తి. — 39. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 41. శ్రీపాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.— 42. శ్రీమ్యాడం అశ్వత్థప్పగారు, కల్యాణదుర్గం. — 43. శ్రీ కానుల శరభయ్యశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 44. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్పశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 45. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడుగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 46. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 47. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 48. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఏ., పెరియంబాడి. 49. శ్రీ నటుకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

నెల్లూరు జిల్లా: 50. బ్రహ్మచారి శ్రీబి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము. కనుపర్తిపాడు. — 51. శ్రీ జూపల్లి సూర్యప్రకాశరావుగారు, జూపల్లివారి నగరి, వెంకటగిరిటౌన్.

కృష్ణా జిల్లా: 52. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. — 53. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. బందరు. 54. శ్రీ పోటుమర్తి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 55. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. 56. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 57. శ్రీ సమయమంతుల రామకృష్ణారావు & బ్రదర్స్, ర్యాలి. — 58. శ్రీ మాతెంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 59. శ్రీ మాగెంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి — 60 శ్రీసమయమంతుల వెంకటరత్నం నాగమ్మ గార్లు & రామన్న మాణిక్యంబగారి స్మారకముగ శ్రీ వెంకటసుబ్బారావుగారు, ర్యాలి — 61 శ్రీ సమయమంతుల జగన్న కుమారులు జగ్గారావు, బుచ్చిరాజు, వెంకటరత్నం గార్లు, ర్యాలి. — 62. శ్రీ నా సీతపల్లి వీరభద్రరావుగారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా: 63. శ్రీ ఆబోతుల రామన్న గారు, పాలకొల్లు. – 64. శ్రీ మామిడి సత్యనారాయణ గారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 65. శ్రీ పి. వి. రంగారావుగారు, నల్గొండ. – 66. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావు గారు, నల్గొండ. – 67. శ్రీ నాగబండి విశ్వనాథంగారు, వరంగల్. – 68. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, వరంగల్. – 69. శ్రీ గండె రాజయ్యగారి లింగయ్యగారు, వరంగల్. – 70. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, వరంగల్. – 71. శ్రీ తాటికొండ నాగయ్యగారు, వరంగల్. – 72. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, వరంగల్. – 73. శ్రీ మడూరు బసవలింగం గారు, వరంగల్. – 74. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్. – 75. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్. – 76. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు, వరంగల్. – 77. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, వరంగల్. – 78. శ్రీ గన్ను బుచ్చయ్యగారు, వరంగల్. – 79. శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసం గారు, వరంగల్. – 80. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ – 81. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 82. శ్రీ చండా పుల్లయ్యగారు, వరంగల్ – 83. శ్రీ చిదిరాల రాజశేఖరం గారు, వరంగల్ – 84. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, వరంగల్.

మైసూర్ రాష్ట్రం: 85. శ్రీ కానుబాళ అంబణ్ణ శ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హొస్పేట్ 86. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠి గారు, బంగారుపేట. – 87. శ్రీ క. ఆర్. సీతారామయ్య శ్రేష్ఠి గారు, బంగారుపేట. – 88. శ్రీ క. నంజప్ప శ్రేష్ఠి గారు, బంగారుపేట. – 89. శ్రీ నారాయణమూర్తి గారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. – 90. శ్రీ శి. చౌడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. – 91. శ్రీమతి కుసుమ భాగ్యలక్ష్మమ్మ గారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

మద్రాసు రాష్ట్రం: 92 శ్రీ శంకరనాయుడుగారు, కార్వేటిరు, నార్త్ ఆర్కాడు జిల్లా. – 93. శ్రీ సి. ఎస్. నాగరాజ శ్రేష్ఠి గారు, కొళ్లేగాలం, కోయంబత్తూరు జిల్లా.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు-16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డి గారు, వండవాగలి, ఆలూరు తాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మ గారు, పొన్నమ్మ గుడివీధి, చిత్తూరు.
4. కోనూరి సూరాయమ్మగారు, వెదిరేశ్వరం, తూర్పు గోదావరి.

---

**Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool Andhra.**

◆◆◆◆◆◆ కవిత ◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# శ్రీ భగవద్గీతా సారము

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆ బాలకవి ఓ. నారాయణప్పగారు ◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## షోడశాధ్యాయము - దైవాసురసంపద్విభాగయోగము

సీ॥ అభయాది సద్గుణాలారయ మదిలోన
దైవసంపదయని ధరణినొప్పు
దంభాదిదుర్గుణతతి నాసురంబగు
దైవసంపద మోక్షదాయకమగు
నాసురసంపద నధిక జన్మలనిచ్చి
సుఖదుఃఖ నరకముల్ చొరగజేయు
నరక కవాటమ్ములరయఁ గామక్రోధ
లోభము ల్వీడిన శోభనమగు

గీ॥ నన్ను బొందంగ నర్హుడౌ నరుడు గాన
శాస్త్రవిధికార్యముల్ శ్రద్ధజరుపవలయు
ననె నరునకప్పు డాహరి యనుచుదెల్పు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆



◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

ॐ

# మేలుకొలుపు

★

మేలుకొను గీతామాతా మేలుకొను జ్ఞానప్రపూతా
మేలుకొను భగవచ్ఛ్రీముఖపద్మసంజాతా మేలుకొను గీతామాతా॥

ఉపనిషత్తులె గోవులనుగా పార్థునదె వత్సంబుగాగా
దోగ్ధ హరి క్షీరంబులను నిను పితుక నిలచెనుగా ॥మే॥

తత్త్వవృష్టిని గురిసి నేగను నిత్యవస్తుజ్ఞానమొసగియు
తృష్ణయను బంధంబు బాపియు తృప్తినొసగగనిగా ॥మే॥

ఈషణాత్రయములను జిక్కియు వేసటయు బొందెడూ
సుతులను దోసమెంచను జననిహృదయము నీకు తగునటవే ॥మే॥

నీదు హృదయమె ఉపనిషత్తులు నీదు కరుణయె బ్రహ్మ
విద్యయు నీదు వాణియె యోగశాస్త్రము నీవె హరినిలయం॥మే॥

నరుడె నీసుతుడనగ నెంచితో జగమదెల్లను నీకుటుంబమె
దురితమెల్లను బాపి శ్రీహరిదాసి నేలగనూ ॥మే॥

నల్లాన్ చక్రవర్తుల వెంకటలక్ష్మమ్మ.
మార్కాపురం, కర్నూలు జిల్లా.



శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, 1955 ప్ర. 1000.